# (అవి)నీతి నీకు దిక్కెవరు ...?

పూర్తి హాస్యనాటిక

— సీ. వి. రమణ

బయనబోయిన
వెంకటేశ్వరరావు

3.00

# (అవి) నీతి నీకు దిక్కెవరు?

(స్త్రీ పాత్రలేని మహోజ్వల నాటిక)

రచన:

బైనబోయిన

నవరత్న బుక్ సెంటర్

విజయవాడ-2.

మలిముద్రణ] 1983 [వెల: 3-00

# అంకితం

కళాకారులు- కళాప్రియులు- భరతమాత దాస్య శృంఖలాలను తునాతునకలు చేయుటకు కొనసాగించిన అనంత పోరాటంలో నిరంతరం కృషిసల్పిన స్వాతంత్ర్య సమర యోధులైన శ్రీ పర్వతం వెంకటేశ్వరరావుగారికి కళాకుసుమాలతో ఈ నాటికను అంకితమిస్తున్నాను

—వైనతేయుడు

# పాత్రల పరిచయం

| | |
|---|---|
| నరసింహం | భూస్వామి 45 సం॥ |
| పుల్లిగాడు | నౌకరు 50 సం॥ |
| ఎల్లిగాడు | నౌకరు 25 సం॥ |
| శాంతికుమార్ | 22 సం॥ |
| కిట్నాలశాంతయ్య | 45॥ |

(నరసింహంగారి భవనంలో అది ఒక గది. గదిలో ఇంట్లోనుంచి గదిలోకి వచ్చుటకు ఒక ద్వారం, బయటనుంచి గదిలోకి వచ్చుటకు ఒక ద్వారం ఉంటాయి. గదిలో ఒక ప్రక్క టేబిల్ ఒకటి, టేబిల్ ప్రక్కనే రెండు కుర్చీలు ఉంటాయి. టేబిల్ పైన వార్తాపత్రిక ఒకటి, ఫోన్ ఒకటి ఉంటాయి. టేబిల్ సొరుగులో ఒక కొరడా వుండాలి గోడలకు దేశ నాయకులఫోటోలు ఉంటాయి. మధ్యగోడకు భారతమాత పటో లేక కేలండర్ ఉండుట మంచిది. అలంకరణ అంతా ఒక విధమైన పెద్ద తరహా కుటుంబానికి సంబంధించి నదిగా ఉండాలి.

తెర తీచేసరికి నరసింహం పేపరు చదువుతూ అటూ ఇటూ తిరుగుచుండును)

నరసింహం : పేపర్లో చూస్తూ విజయవాడ, 10-8-1979 చిట్టెలుకి చిన్నారావు తప్పిపోయాడు. వయస్సు 18 సంవత్సరాలు, నిండయిన విగ్రహం, చామనఛాయ

రంగు. ముఖంపై నల్లని మచ్చ వుంటుంది. మూ... ఉదయం పేపరు తీయగానే తప్పిపోవటం తప్ప మరేం అగుపించదలేదే. (పేజీతిప్పి, బెల్లంకొండలో అల్లగ కొంప హత్య. నిందితులని ముగ్గురు వ్యక్తులని పోలీసులు కష్టడీలోకి తీసుకున్నారు. పోలీస్ ఇన్‌స్పెక్టర్ యమకింకరరావు మిగిలిన దోషులకొరకు దర్యాప్తు జరుపుచున్నారు. (పేజీ త్రిప్పి) యోగినాధం జనతా పార్టీకి రాజీనామా చేసి, కాంగ్రెస్(ఐ) లో చేరిక (స్వగతం) హాఁ! రాజకీయం అంటేనే రంగులు మార్చటంకదా! వీరు పార్టీలు మారారు. అసలు ఈరోజుల్లో పార్టీలు మార్చటం ఒక ఫాషన్‌గా తయారయింది. పార్టీలు మారనివారు (ఐ) నాయకులు కాలేరు. ఏ పార్టీకి బలం వుంటే ఆ పార్టీ జెండా నీడలో తలదాచుకునే ప్రజాసేవకులు వీరు. పదవులకోసం పార్టీలు మార్చే పెద్దలు వీరు.

[బయటనుంచి "బాబయ్యా"]

వర : ఎవర్రా అది?

బయ : నేనేనండి బాబయ్యా! నా కాలమ్మకొడుకుని.

వర : ఏంటిరా?

బయ : ఇయ్యాల ఎల్లిగాడు పనికి రాడంట బాబయ్యా!

వర : ఏంటిరా వాడికి ఏమయింది?

బయ : జరమొచ్చినాది బాబయ్యా, ఒళ్ళు కాలిపోతుంది.

వర : జ్వరం తగిలితే, ఇక్కడ ఈ పనంతా ఎవరు చేస్తారంట వాడి అమ్మ మొగుడు?

బయ : ఏమోనండి బాబయ్యా!

నర : నేను వాడ్ని రమ్మన్నానని చెప్పరా!

బయ : అలాగే దొరా!

నర : తిండికి తిండిబోతులు- పనికి దొంగలు. తేరగా వస్తుందని కంచాలు కంచాలు తింటే రోగాలు రాక ఏమొస్తాయి. చీమ చిటుక్కుమంటే పని మానేస్తారు. ఇక్కడెవరు చేస్తారో వాళ్ళ బాబుగాడు.

[పుల్లిగాడు ప్రవేశం. బక్కచిక్కిన మనిషి, తల నెరిసింది. చిందర వందరగా తైలసంస్కారం లేదు. గడ్డం మాసివుంది. నీరుకాయబట్టిన బాడీ ధరించి ఉన్నాడు. చిరిగిన పంచ మొలకు చుట్టుకున్నాడు. చిరిగి, మాసిన కండువ భుజంపై ఉంటుంది.]

పుల్లిగాడు : బాబయ్యా!

నర : ఏంటి నీకేమొచ్చింది?

పు : నాకేటి రాలేదు బాబయ్యా. మీకే ఉత్తరమొచ్చింది.

నర : ఉత్తరమా ఏది?

పు : ఇదిగోండయ్యా. (ఉత్తరం ఇచ్చాడు)

నర : (చదువుతూ) అరే, పుల్లిగా రేపు కాదు ఎల్లుండి పట్నంనుంచి అమ్మాయి వస్తుందిరా!

పు : సౌరాజ్యమ్మగారా బాబయ్యా!

నర : అవునురా! నా ఏకైక కుమార్తె బి.ఏ. పూర్తిచేసుకుని తిరిగివస్తుంది. ఒరే పుల్లిగా ఇల్లంతా జాగ్రత్తగా కడిగి తుడిచి శుభ్రంచేసి అన్నీ సిద్ధంచేయండి.

లేకుంటే అమ్మాయి సిన్న కన్న ఇద్దరికీ కళాయి స్తుంది. అయినా నీవల్ల అవుతుందటాపురా ఈ పనులు?

ఫు : నా కూతురు సుశీలను పిలిచి, దానిచేత చేయిస్తా లెండి.

జర : ఎవరూ? నీ కూతురి సుశీల చేతనా ఛ ఛ ఆ పని మాత్రం చేయించకు.

ఫు : ఏం బాబయ్యా?

జర : ఛ ఛ సుశీల చాలా మంచిది. ఈ మోటుపనులు గొడ్డుచాకిరీ ఆ అమ్మాయి చెయ్యలేదుగాని ముకార్లని పిలిచి చేయించు.

ఫు : మా సుశీలమీద ఎంత దయుండి బాబయ్యా?

జర : పిచ్చివాడా! ఎవరిచేత ఏ పనులు చేయించాలో, ఎవరి చేత ఏ ఏ పనులు చేయించుకోవాలో నాకు బాగా తెలుసు. నీ కుమార్తె మహా చక్కనిది. అలాంటి చక్కని చుక్కచేత ఈ యధవపనులు చేయిస్తారా అసలు మాట్లాడితే ఆ పిల్ల మీ ఇంట్లో ఉండకూడదు నా యింట్లో ఉండాల్సింది. ఏ యం. బి. బి. యస్. డాక్టరో లేక నాలాంటి భూస్వామో దీనికి మొగుడు కావాలి. అప్పుడు దాని అందం చందం బంగారానికి పరిమళం అంటినట్లుంటుంది.

ఫు : నేను అంతటి మారాజ్ని ఎక్కడ తెచ్చేదిబాబయ్యా? మా చితికిన బ్రతుకులకు అతుకు లేసుకునేసరికి నా ప్రాణం పోతుంది.

నర : నీవేం చేస్తావు పోరా! అదంతా మీ సుశీల ఇష్టంపై ఆధారపడివుంది. వెళ్ళి పనిచూడు.

వు : అట్టాగే బాబయ్యా! అదురుట్టానికి మించింది లేదు.
(వుల్లిగాడు బయటికెళ్ళాడు పేపరు మడిచి టేబుల్‌పై పెడుతూ)

నర : (స్వగతం) హుఁ! అందగత్తెల్నే తలదన్నే అందగత్తె ఆ సుశీల. దాన్ని ఎలాగయినా అనుభవించాలి. నా ఉంపుడుగత్తెగా మార్చుకోవాలి అది నా కౌగిట్లో కరిగిపోవాలి.

[బయటనుండి ఎల్లిగాడు ప్రవేశం. యువకుడే కాని జ్వరంవలన వణుకుతూ చిరిగిపోయిన దుప్పటి కప్పుకున్నాడు. గడ్డం మాసివుంది. కట్ బనీను ధరించాడు. పంచ కట్టుకున్నాడు. బలంగల మనిషి. కానినరసింహం ఎదుట నిలబడలేకపోయాడు]

ఎల్లిగాడు : బాబయ్యా పిలిచారా అండీ-

నర : ఏరా దొంగనాకొడకా? ఏమయిందిరా నీకు?

ఎ : తలకాయనొప్పి, వళ్ళు మంటలు బాబయ్యా!

నర : అందుకని పనిలోకి రాకుండా ఉంటే తగ్గుతాయా?

ఎ : వారం రోజుల్నుంది ఇట్టాగే మొండికిపడి పనిజేసినా! ఈయాల పనిజేయలేను బాబయ్యా.

నర : మరి మీ బాబు చేస్తాడంటారా?

ఎ : [మాట్లాడడు]

నర : ఏరా మాటాడవేరా దొంగనాకొడకా?

ఎ : ఏటి సెప్పేది బాబయ్యా? నాను పన్జెయ్యలేను.
పర : ఎవరు చేస్తారూ అంటున్నా? కందులు తిన్నట్లు తింటున్నారు కదరా నా సామ్మీ! తిన్నదాంట్లో కనీసం నాలగోవంతన్నా పని చెయ్యాలి కదరా. తేర తిండి తిని తేరకండలు పెంచుకుంటే ఏం లాభం? పని చేయాలి. ఒరేయ్ ఎల్లిగా ఒకటిమాత్రం గుర్తుంచుకో. మీ బ్రతుకులు నా చేతులలో ఉన్నాయి. నేను చెప్పిన పని చెయ్యాలి. నేను ఆడినఆట ఆడాలి కదా! మీ బతుకులకు బటిసిపోటు తప్పదు.

ఎ : అన్నిమాట లేటికి బాబయ్యా? రేపొద్దున్న వచ్చేస్తా పనిలోకి.

పర : ఈరోజు పొలంపనులు యింటిపనులు ఎవరుచేస్తార్రా?

ఎ : [మౌనం]

పర : ఏందిరా? గుడ్డెద్దులాగా తలకాయ వంచుకుని నిలబడతావు? ఆ! అసలు విషయం మర్చిపోయాను. మీ రేదో కల్లెలో మీటింగు పెట్టారంట నిజమేనా?

ఎ : నిజమే బాబయ్యా.
పర : ఎందుకురా మీటింగు? మీ బ్రతుకులకి అదొక్కటేరా తక్కువ.

ఎ : ఎందుకేటి బాబయ్యా. ఆ కాంతిబాబుగోరు మా పల్లెలో మీటింగెట్టి మా గురించి చెబుతుంటే మా బతుకులు ఎంత నీచంగా వుండాయో అప్పుడు ఎరికైనాది.
పర : అలాగా!

ఎ : మీరంతా కష్టజీవులు. మీ చెమటతో నేలు తడిసి మీ కండల్ని నేలకి సత్తువగా పెట్టి పంట పండిస్తున్నారు. రాసుల రాసుల ధాన్యాన్ని భూస్వాములు తమ గాదెలు నింపుకుంటున్నారు. మీకేమో తింటానికి తిండి లేదు గింజల్లేక కటకటలాడిపోతున్నారు. ఇదంతా ఎందుకు జరుగుతుందంటే__ మీకు చదువులేదు_ తెలివిలేదు. మీకు అన్యాయాన్ని ఎదిరించే ధైర్యం లేకుండా ఆ భూస్వాములు చేశారు. వారు మిమ్మల్ని దోపిడీ చేస్తున్నారు. ఈ దోపిడీని ఎదిరించండి. భూస్వాములకు ఎదురుతిరగండి.

నర : క్షణంలో టేబిల్‌లోని కొరడా తీసి ఎల్లిగాడ్ని కొట్టాడు.

ఎ : అబ్బా! ఏంది బాబయ్యా నన్ను ఉత్తి పున్నానికి కొట్టినారు?

నర : ఇప్పుడు తిరగరా ఎదురు?

ఎ : నేను అనలేదు బాబయ్యా! ఆ క్రాంతిబాబుగోరు సెప్పినారని సెబుతున్నాను. అంతే బాబయ్యా.

నర : ఆ క్రాంతిబాబుకి కాలం మూడింది. వాడికి పాడెయ్యకాలం కనుచూపుమేరలో కాచుకొని కూర్చుంది ఇంకా ఏమన్నాడు?

ఎల్లి : మీరంతా ఒక సంఘంగా ఉండండి. ఈరోజునుంచి మీ పిల్లల్ని సదువుకు పంపండి. మీ కష్టానికి తగి ఫలం అడిగి తీసుకోండన్నారు బాబయ్యా!

నర: దీనికి మీరేం చేశారు?

ఎల్లి: అందరం ఆ బాబుగారి మాటకి తలవొగ్గేశాం! మా పల్లెలో సంగం పెట్టినారు.

నర: దానికి ప్రెసిడెంటు ఎవరు?

ఎల్లి: నేనే బాబయ్యా!

నర: ఆ! నువ్వా (ఆశ్చర్యం)

ఎల్లి: ఔను బాబయ్యా! నేనే!

నర: ఎంత ధైర్యంరా నీకు! నాకు తెలియకుండా ఆ సంఘంలో ఎందుకు చేరావు? దానికి ప్రెసిడెంటు నీవే నంటూ మహా ధీమాగా చెబుతున్నావు కదరా! ఏం చేస్తుందిరా మీ సంఘం, కన్నీళ్ళు కారుస్తుందా మీ సంఘం.

ఎల్లి: కాదు బాబయ్యా, కన్నీరు తుడుస్తాది! పేదోళ్ళ గుండెలకి కొండంత బలంనిస్తాది.

నర: ఇప్పుడు ఇక్కడ నిన్ను తంతే ఎవరు దిక్కురా నీకు?

ఎల్లి: తప్పు లేకుండా ఏటికి తంతారు బాబయ్యా!

నర: (కోపంతో) రేయ్ ఎల్లిగా! అడదాకా వచ్చావంటరా లంజకొడక.

ఎల్లి: మాటలు మీరకండి బాబయ్యా!

నర: ఏం కూశావురా బండనాయాల!

ఎల్లి: అదే బాబయ్యా! మాటలు వంకరగొస్తున్నా యంటున్నాను.

నర: వస్తే ఏం చేస్తార్రా?

ఎల్లి: తప్పు నేకుండా ఏటికి తిడతారు బాబయ్యా?

నర: తప్పులేంటిరా నా కొడకా (కొట్టాడు)

ఎల్లి: అబ్బా! బాబయ్యా, ఏటికి బాబయ్యా, నన్ను కొడతావ్?

నర: కొట్టటం కాదురా! నిన్నూ నీ సంఘాన్ని కోస్తాను. తిండికి టికాణాలేని లేబర్ నా కొడుకుల సంఘాలా! పార్టీలా! (మళ్ళీ కొట్టాడు)

ఎల్లి: [క్రింద పడ్డాడు] అమ్మా!

నర: ఒరే ఇప్పుడు చెప్పరా నా కొడకా! (నరసింహం ఒక్కొక్క అడుగు ముందుకు వేస్తూంటాడు కొరడా పట్టుకొని. ఎల్లిగాడు భయం భయంగా క్రిందకూచునే వెనక్కి వెనక్కి జరుగుతూ ఉంటాడు) నీ సంఘం ఏం చేస్తుందో. ఒరేయ్! ఈ నరసింహం తలచుకుంటే మీ బ్రతుకులు భగ్గు భగ్గున మండిపోతాయి రా! ఈ ఊళ్ళో ఏ నా కొడుకైనా నామాట కెదురుపలికి, నా కెదురు నిలబడితే వాడి శవం కోనేటిలో కోలాట మాడుతుందిరా.

ఎల్లి: ఏటి బాబూ ఈ దౌర్జన్యం?

నర: హహహ! దౌర్జన్యం! హహహ! అక్రమం హహహ అందాకా వచ్చావన్న మాట. దౌర్జన్యాన్ని గురించి నాకే నీతులు చెప్పే నీతిమంతుడువా. (కొరడాతో కొట్టాడు)

ఎల్లి: బాబయ్యా (కోపంగా అరిచాడు)

నర: ఏంటిరా గొంతు చించుకుంటున్నావు.

ఎల్లి: నీతిగా బతకాలనుకోవడం తప్పా బాబయ్యా!

నర: అప్పటికి మేము అవినీతిపరుల మటకా! ఒరేయ్! నీతిని ఏనాడో పాతిపెట్టాంరా. ఆ నీతి మీకు రాదు. నీతిని నెలకొల్పే నీతిమంతుడా ఆ క్రాంతికుమార్. నీతికి నీడనిచ్చే జాతిబిడ్డా మీ క్రాంతికుమార్! వాడిని వాడి ఆశయాలనీ నిలువునా పాతిపెడతాం.

ఎల్లి: అది మీవల్ల కాదు.

నర: ఏం కూశావురా?

[కొరడాతోటి ఎలిగాడ్ని కొట్టాడు. ఎల్లిగాడు ఆ కొరడాను పట్టుకుని పైకి తీస్తూంటాడు. నరసింహం కొరడాను బలంగా గుంజి లాగాడు. ఆ ఊపుకి తాళలేక ఎల్లిగాడు నరసింహం కాళ్ళపైన బోర్లాపడ్డాడు]

ఎల్లి: బాబయ్యా (కోపం)

నర: హాహాహా! హాహాహా! (కాలు వాడిమీద పెడతూ) ఒరేయ్ ఎలిగా! నీతి నీతి అని పాఠాలు నేర్చుకుంటున్నారు గదరా—ఎదిరా నీ నీతి? యెక్కడుందిరా నీ నీతి? హాహాహా! నువ్వేం చెబుతావురా. ఇప్పుడు నీతి యెక్కడుందో తెలుసా? నా కాళ్ళక్రింద నీతి గిలగిలా కొట్టుకుంటుంది. కాపాడరేం. కాపాడండి అంటూ కేకలు పెడుతుంది నీతి. ఒరేయ్ యిప్పుడు నిన్ను రక్షించే దెవ్వరా?

ఎల్లి: ఛీ! నీతిమాలిన కుక్క.

వర: (ఉగ్రుడై) రేయ్ (కొరడాతో చళ్ చళ్ మంటూ కొట్టాడు. ఎల్లి గాడు బాధపడుతూ వుంటాడు) ఇక్క డెవ్రా నీ నీతికి దిక్కెవ్రా, నీతిని రక్షించే నాథు డెవ్రా?

[క్రాంతికుమార్ ప్రవేశించాడు]

క్రాం: ఆగు.

వర: క్రాంతికుమార్ గారా.

క్రాం: ముందు అతనిమీద కాలుతియ్యి.

వర: తియ్యకపోతే ఏంచేస్తావ్?

ఎల్లి: [కాలు ప్రక్కకునెట్టి లేస్తూ] కాలు ఇరగదీస్తాము.
(పైకి లేచాడు)

వర: రేయ్, ఎలిగా ఈ పిల్ల కాకేగా మీటింగు పెట్టింది. ఈ క్రవన్యాసేనా మిమ్మల్ని ఎదురుతిరగమన్నది.

క్రాం: ఔను నేనే

వర: అంటే నీవు విప్లవాన్ని లేవుతున్నావా. విప్లవకారుడి వన్నమాట.

క్రాం: ఓహో. పనికి తగిన ప్రతిఫలం అడగటం అడగమనటం కూడా విప్లవమే అవుతుందా. మంచిని చెప్పిన ప్రతి వాడూ విప్లవకారుడేనా. అనామకుల్నీ అమాయకుల్ని అవసరాలకు వాడుకొని అవసరం తీరింతర్వాత వారి ముఖం చూడనివారి నేమనాలి. పేదప్రజల్ని బెదిరించి వారిచేత కాయకష్టం చేయించుకొని మీ గాదెల్ని ధాన్యంతో నింపుకొని కులికే మీలాంటివారి నేమ

నాలి బాబూ. మా రెక్కలు ముక్కలయినాయి ఈ రోజుకి తిండిగింజలు లేవు. మానెను గింజలివ్వండి బాబూ అంటూ మీ ద్వారందగ్గర కాచుకొని దేబిరించే ఇలాంటి దౌర్భాగ్యుల్ని కొరడాలతో పశువుల్ని కొట్టినట్లు కొట్టే మిమ్మల్ని ఏమనాలి?

పర: మిస్టర్ కుమార్! మాలాంటి వాళ్ళనే హేళన చేయకు. మీతోటి కయ్యానికి కాలుదువ్వకు. బంగారంలాంటి భవిష్యత్తు నెందుకు బుగ్గిపాలు చేసుకుంటావు. మా కోపానికి గురికాకు.

క్రాం: మీ కోపతాపాలతో మాకేంటి. సాటిమనిషిని మనిషిగా చూడమంటున్నా! మీ అడుగులకు మడుగులొత్తి, మీ చేలలో గొడ్డుల్లాగ పనిచేసి, మట్టిలో మాణిక్యాలు పండించే ఇలాంటి కష్టజీవులకు కడుపు నిండా అన్నం పెట్టమంటున్నాను. మనిషి మనిషిగా బ్రతకడానికి మార్గం చూపించ మంటున్నాను. మిమ్మల్నే నమ్ముకున్న ఈ మూగజీవుల్ని ఆదరించ మంటున్నాను.

పర: తేరగా లేదిక్కడ అన్నం దరిద్రుల కందరికీ పెట్టడానికి.

క్రాం: హు! ఎవరినయితే దరిద్రులని నీచంగా మాట్లాడుతున్నావో ఆ దరిద్రులే మీలాగా పనిచేయకుండా పడుకొంటే అప్పుడు ఎవరు దరిద్రులో ఎవరు అన్నదాతలో అర్థమవుతుంది. ఎయిర్ కండిషన్ రూముల్లో హుషారుకొల్పే నిషామత్తులో గ్రుడ్లుతిరిగే పానల

కింద మెత్తని స్ప్రింగ్ పరుపులపై పవళించే సోమరులకు వీళ్ళు దరిద్రులుగానే కనిపిస్తారు.

నర: మాటలు మర్యాదగా రానియ్యి.

క్రాం: మర్యాదలు నిలుపుకోలేని బ్రతుకులు మీవి.

నర: ఎవరివయిందీ త్వరలోనే అనుభవిస్తావు.

క్రాం: బెదిరిస్తున్నావా?

నర: హెచ్చరిస్తున్నాను.

క్రాం: అదే హెచ్చరిక నేనూ చేస్తున్నాను.

నర: తలబిరుసు పనికిరాదు.

క్రాం: మీ అక్రమాలు, అన్యాయాలు ఇక సాగవు.

నర: మర్యాదగా ఇక్కడనుండి వెళ్ళిపో. నా యెదుట నీవు మాట్లాడుతుంటే వళ్ళు మండిపోతుంది.

క్రాం: మా మాటలకి మీ వళ్ళు మండితే మా చేతలకి మీ ఇళ్ళే మండి మసైపోతాయి వస్తా. పోదాం రా ఎల్లయ్యా.

నర: ఆగు!

క్రాం: (వెనుతిరిగి) ఏంటి?

నర: నాకు అడ్డురాకు. లేదా నిన్ను ఏంచేయాలో అదే చేస్తాను.

క్రాం: మంత్రాలకి చింతకాయలు రాలవు.

నర: అనుభవిస్తావు.

క్రాం: ఎవరు అనుభవించేదీ త్వరలోనే తేలుతుంది.

[క్రాంతికుమార్ వెళ్ళాడు. అతన్ని ఎల్లిగాడు అనుసరించాడు. ఇద్దరూ వెళ్ళిన తరువాత కాలుకాలిన పిల్లి లాగా అటూ ఇటూ తిరుగుతుంటాడు]

నర: ఏ పనయితే జరగరాదనుకొన్నానో ఆ పని జరిగింది. యువజనసంఘం ఉదయించింది. నోరులేని ఈ లేబర్ నా కొడుకులు మాటలు నేర్చారు. దీనంతటికీ కారణం ఈ క్రాంతికుమార్. ఒరేయ్ క్రాంతికుమార్! నీ కాలం తీరిపోయింది. ఇక యెంతో నేవు ఈ లోకంలో బ్రతకలేవు, బ్రతకనివ్వను (లోనికి వెళ్ళాడు)

[బయటనుంచి కట్నాల కాంతయ్య ప్రవేశం]

కాంత: నరసింహం (జవాబు లేదు) నరసింహం!

నర: (లోపలనుంచి) ఎవరూ?

కాంత: నేను కాంతయ్యను.

నర: (వచ్చి) రమయ్యాని కొచ్చావు కూర్చో!

కాంత: ఏంటిరా ఏమైంది?

నర: జరగవలసిందే జరిగింది

కాంత: ఏం జరిగిందో చెప్పు.

నర: పట్నంనుంచి మీవాడు యెప్పుడొచ్చాడు?

కాంత: క్రాంతికుమారా!

నర: ఔను వాడే!

కాంత: నాలుగురోజులయింది.

నర: ఎంతయినా కన్నతండ్రివి కాబట్టి నీతో చెప్పటం ఎంతయినా మంచిది.

కాంత: ఏంటిరా?

నర: నీ కుమారుడు నాపైనే దండయాత్ర ప్రారంభించాడు.

కాంత: అంటే?

నర: ఆ కూలి యదవల్ని వెనక వేసుకొని మాట్లాడుతున్నాడు.

కాంత: ఆ!

నర: వాళ్ళకి నామీద లేనిపోనివన్నీ నూరిపోసి నాపై కోపం రేపుతున్నాడు.

కాంత: అలాగా!

నర: నా బలమేంటో నీకు బాగా తెలుసుకదూ, యిక నీ యిష్టం.

కాంత: నా యిష్టమేంటిరా చవటసన్నాసి! పిల్లవాడు ఏదేనా అంటే చెవులు రెండూ మెలివేయక యింకా తిరు
దునా అని నాతోటి చెబుతున్నావుకదా!

నర: చెవులు మెలివేసేంత చిన్నవాడు కాదురా నీ కొడుకు- దేశాన్ని ఉద్ధరించేంత పెద్దవాడయిపోయాడు.

కాంత: ఏడ్చాడు.

నర: ఆలస్యంచేస్తే నన్ను వడిపిస్తాడు.

కాంత: అఘోరించాడు పిల్లసన్నాసి.

నర: ఒరే కాంతయ్యా! నీ కొడుక్కేంపనిరా ఆ కులం తక్కువ ఇక్కలతోటి.

కాంత: అక్కడే వుందిరా చిక్కు.

నర: ఏంటది?

కాంతి: మీ ఇంటో పనిచేసే పులిగాడికి ఒక కూతురుంది.

వర: ఉంది. మంచి అందగత్తె, అంతో యింతో చదువు కున్నది.

కాంతి: ఆ పిల్లని మా నన్నాసి ప్రేమించాడట.

వర: ఆ!

కాంతి: పెళ్ళి చేసికొంటాడట!

వర: అలాగే!

కాంతి: వేరే కాపురం పెడతాడట.

వర: ఆ!

కాంతి: అదీ పల్లెలో పెడతాడట,

వర: ఆడిదాకా వచ్చిందన్నమాట.

కాంతి: అన్నమాటేంటి ఉన్నమాటే! పదిమందికీ తెలియక ముందే దీనికి ఒక మార్గం ఆలోచించాలి.

వర: ఏం చేసాం?

కాంతి: అది తెలిస్తే నీదాకా ఎందుకు?

వర: అసలేమంటున్నాడు?

కాంతి: ఆ కులంతక్కువ పిల్లనితప్ప మరొక అమ్మాయిని పెండ్లి చేసుకోడట. తన ఆశయాలే వేరట. తన సిద్ధాంతాలే వేరట. కులాల మతాల కట్టుబాట్లు తనకు లేవట. మీ పులిగాడి కూతుర్ని తప్పక చేసుకుంటా డట రిజిష్టర్ పెళ్ళి చేసుకొంటానని బెదిరిస్తున్నాడు.

వర: [వింటూ వున్నాడు]

శాంత: మొన్న నాలుగురోజులనాడు పెద్దాపురం పెద్దయ్య గారు తన ఏకైక కుమార్తె నిస్తానని కబురుపంపారు అది ఎలాంటి సంబంధం, 100 ఎకరాల మాగాణి, 5 ఎకరాల కొబ్బరితోట, 50 ఎకరాల నిమ్మతోట, 2 ఎకరాల చెరకుతోట అబ్బో అట్టహాసం కెటమకు గదంట.

నర: ఈ సంగతి చెప్పావా?

శాంత: చెప్పటం ఏం ఖర్మ. వినయాన్నంతా పోదంచేసి తేనెలో కలిపి నాలుకకి అందించినట్లు చెప్పాను, వింటేగా! వాడి మనసు ఎంతసేపటికీ ఆ కులంతక్కువ దానిచుట్టు తిరుగుతుంది అంత కట్నం వచ్చేటట్టయితే కాలదన్నుకుంటారా చెప్పరా.

నర: ఊ!

శాంత: నిన్న గాడిదతోటిపాలెం XOX రాజుగారి దగ్గరనుంచి ఉత్తరమొచ్చింది. వాళ్ళమ్మాయి పట్నంలో బి. ఎ. చదువుతూందట. 100 సవర్ల బంగారం వుంది, 500ఎకరాల మాగాణి, 400 ఎకరాల మెట్టపొలం, దాదాపు 60 లక్షల నగదు, 4 టీతోటలు, 8 ఫాక్టరీలు ఇంద్ర భవనంలాంటి 10 పెద్దభవనాలు, ఇది ఎలాంటిసంబంధం మేలిమి బంగారం లాంటిది. అలాంటి సంబంధాన్ని కాలదన్ని కులం తక్కువదాన్ని, గుణం తక్కువ దాన్ని కావాలంటున్నాడు.

నర: ఇప్పుడేం చేదాం మరి?

శాంత: ఎలాగయినా ఆ పులిగాడి కూతురుమీదనుంచి మా (శాంతికుమార్ మనసు మార్చాలి. ఎలా-

వర: అసలు ఆ పులిగాడి కూతురు సుశీలను నేను ప్రైవేటు మనిషిగా ఉంచుకొందామని కలలుగన్నాను. మీవాడి మనసూ ఆ సుందరిపైనే ఉంటున్నమాట.

శాంత: మావాడు ఒక్కడేంటి ఈ ఊళ్ళో కుర్రకుంకలువాడి వాడి వేడివేడి చూపులన్నీ ఆ వగలాడి వంటిపైనే కదండి.

వర: ఇంతకీ ఆ సుశీలమీదనుంచి మీవాడి మనసుమార్చాలి అంతేగా.

శాంత: అంతే మరి!

వర: అయితే ఒకపని చేయాలి.

శాంత: ఒకటేంటి వందపనులు చేస్తాను.

వర: నువ్వుచేసే వందపనులూ ఒకఎత్తు ఇప్పుడు చెయ్యాల్సిన పని ఒకటీ ఒక ఎత్తు.

శాంత: చెప్పండి మరి!

వర: ధైర్యముందా నీలో!

శాంత: ధయిర్యానికేముంది హిమాలయపర్వతమంత ఉంది.

వర: భయపడకూడదు!

శాంత: భయం అనేది నన్ను చూసి భయపడాల్సిందే.

వర: అలాఅయితే ఒకపని చెయ్యి. (శాంతయ్య చెవిలో ఏదో రహస్యంగా చెప్పాడు)

కాంతి: నాకొడుకు బాగుపడాలేగాని ఏదైనా చేస్తాను.

నర: ముందు వెళ్ళి ఆ పనులు కానివ్వు.

కాంతి: అలాగే, వెళ్ళొస్తా! (వెళ్ళును)

నర: హహహ! ఈ దెబ్బతో క్రాంతికుమార్ గింతికుమార్ అంతా చిత్తుగా ఓడిపోతారు ఈ నరసింహం ప్లాన్ వేస్తే పడని పిట్టటు లేదు హహహ!

(బయటనుంచి పులిగాడు ప్రవేశం)

పులి: బాబయ్యా!

నర: ఏంటిరా పులిగా?

పులి: ఈరాత్రికి ముత్యాలుచేత యిల్లు కడిగించి ముగ్గులెట్టిస్తా.

నర: శుభ్రంగా తయారుచేయాలి ఇల్లంతా!

పులి: మీారు సెప్పాలా బాబయ్యా. (పోతోయి) బాబయ్యా ఇయ్యాల పొద్దుపోయిం తర్వాత యింటికెళ్ళి పడుకుంటా!

నర: ఎందుకురా, పొలంలోని కొట్టందగ్గిర పడుకో.

పులి: ఇంటికాడ సుశీల ఒక్కతే బాబయ్యా. పసిపిల్ల భయపడుద్ది.

నర: పరవాలేదులేరా. ప్రక్కవాళ్ళు ఉంటంలా.

పులి: మీా యిట్టం బాబయ్యా!

నర: ఎద్దులదగ్గర జాగ్రత్త! దొంగలు బాగా తిరుగుతున్నారు కొట్టం దగ్గరే పడుకో, ఇంటికెళ్ళకు.

పు : అట్టాగే బాబయ్యా!

పులిగాడు బయటకి-నరసింహంలోనికి పోబోతుండగా
లైట్లు ఆరిపోతాయి]
(లైట్స్ ఆఫ్ అండ్ ఆన్)

[అప్పుడే తెల్లవారుతుంది, పక్షుల అరుపులు విని పిస్తుంటాయి. దూరంనుంచి భగవద్గీత తక్కువ స్థాయిలో వినిపిస్తుంది. గదిలో ఎవరూ ఉండరు. బయటనుంచి "బాబయ్యా" అని పులిగాడు కేక పెట్టాడు. ఆ కేకలో భయం ఆవేదన మిళితమైనాయి. రెండవసారి మరలా "బాబయ్యా" లోపలనుంచి నరసింహం "ఎవరూ" అన్నాడు. మరలా బయటనుంచి పులిగాడు బాబయ్యా అనే వాడికేక ఒక్కసారి ప్రవేశించాయి. అదే సమయంలో లోపలినుంచి నరసింహం ప్రవేశం]

నర : ఏంటిరా! అలా అరుస్తున్నావు?

పు : నా కొంప నిలువునా కూలిపోయింది బాబూ! నా ఆశ అడిఆశ అయినాది బాబయ్యా! (ఏడ్పు)

నర : ఏంటిరా? ఏమైంది?

పు : జరగరానిదే జరిగింది బాబయ్యా! ఎవరికోసమయితే నేను బతికానో అప్పు నన్నొదిలి వెళ్ళిపోయాడు. బాబయ్యా!

నర : వెళ్ళిపోయింది ఎక్కడికి?

పు : పైలోకానికి బాబయ్యా. మనకి కనిపించని వినిపించని చోటుకి?

నర : ఎవర్రా?

వు : ఇంకెవరు బాబయ్యా? నా ప్రాణంలో ప్రాణం, నా కూతురు సుశీల బాబయ్యా! నా తల్లి - నా బంగారు తల్లి పోయింది హుహుహు...

నర : ఆ!

వు : (జేబులోంచి ఉత్తరం తీసి ఇస్తూ) ఇదిగో బాబయ్యా నా బంగారు బిడ్డ పైలోకానికి పోతూ నాకోసం రాసి పోయిన కాగితం బాబయ్యా.

నాన్నగారికి
నమస్కారం.

ఈ లోకంలో బ్రతకటం నాకు యిష్టం లేదు. నా కడుపులో ఒక నేరానికి ప్రతిరూపం పెరుగుతూంది. నేను నచ్చిన వానితో నా పెళ్ళి జరిపించటానికి నీవు ఇష్టపడ లేదు. అందుకే ఈ లోకంలో నేను ఒక పతితగా బ్రతకను. చిత్రహింస భరించ లేను.

ఇట్లు
కుమార్తె
సుశీల

నర : ఏరా! నీ కూతురు ఒక అబ్బాయిని ప్రేమించిదనను, తనువూ అన్నీ అర్పించిందట అ కారణంగా ఆమె గర్భవతి అయిందట. ఆ అబ్బాయిని పెండ్లి చేసుకుంటా నంటే నీవు ఇష్ట పడ లేదటగా?

వు : బాబయ్యా! లేదు! బాబయ్యా! నాబిడ్డ నోరిసీ కిమించ లేదు. పెళ్ళి చేసుకుంటానని నన్ను ఏ రోజూ అడగ

లేదు బాబయ్యా. నాకు ఉన్న ఒక్కగానొక్క ఆశ ఆ సుశీలే బాబయ్యా. అది కోరితే నేను కాదంటానా?

శర : సరే ఇంతకీ ఎలా మరణించింది?

వు : మా పల్లెకి పక్కనున్న బాయిలో పడింది.

శర : ఏదీ ఆ చిల్ల గుట్టల చాటునున్న బావిలోనా?

వు : అవును బాబయ్యా! ఆ బావే నా తల్లిని పొట్టన పెట్టుకుంది.

శర : నువ్వెలా తెలుసుకున్నావు?

వు : నేను కొట్టంకాడినుంచి యింటికొస్తుంటే మా పల్లెలో ఆడంగులు సూసినారు. ఆ జనాన్ని చూసి నేనక్కడికెళ్ళాను. ఆ బాయిలో తొంగిసూశా... అంతే బాబయ్యా నా గుండె ఆగిపోయినంత పనయింది. "అమ్మా" అంటూ కేకపెట్టా. తూలి బాయిలో పడబోతూవ నన్ను ఆళ్ళు పట్టుకున్నారు బాబయ్యా! (ఏడుస్తూ వుంటాడు)

శర : ఏడవకురా?

వు : ఏడవక ఏటి సెయ్యమంటారు బాబయ్యా? వున్న రెండు కళ్ళుపోయాయి. నా పాణంపోయినా బాగుండేది. ఆ దేవుడికి న్యాయం లేదు. ఆడు దుర్మార్గుడు. ఆ దేవుడే మంచోడయితే నన్ను తీసకపోయి నా బిడ్డని కాపాడుంటే ఎంత బాగుండేది!

శర : ఆ దేవుని దేముందిరా? అంతా మనం చేసుకున్న పాపపుణ్యాల ఫలితమేరా! ఇప్పుడు జరుగుతుంది.

ఫు : పాపం. ఏం పాపం చేసింది నా సుశీల. ఎవర్ని పల్లెత్తిమాటననేదే? ఎవురికీ కీడు సెయ్యనేదే. ఎందుకు తీసుకు పోయాడు ఆ మాయదారి దేవుడు.

నర : ఈ వార్త వినేసరికి నా గుండె ఆగిపోయినంత పని అయింది. నీ వాలకం చూస్తే కళ్ళవెంట నీరు ఆగడం లేదు. నీకే ఇంత బాధగా ఉంటే ఇక నాకెంత బాధ కలగాలి. ఊరుకోరా! జరిగిందేదో జరిగిపోయింది. అవన్నీ మర్చిపోయి ముందు జరగవలసిన తతంగమంతా జరిపించు. ఇలా అధైర్యపడితే ఎలాగరా?

ఫు ఏటి సేసేది బాబయ్యా? పోలీసోళ్ళు వత్తారంట పంచాయితీ పెట్టాలంట బాబయ్యా. అప్పుడుదాకా మనం ఆ శవాన్ని బయటికి తియ్యకూడదంట

నర : అది నిజమేనోయ్! పోలీసులొత్తే ఈ ఉత్తరం చూసి నిన్ను జైల్లో పెడతాడు. ఇది హత్యలో సమానం. ఈ ఉత్తరం ప్రకారం అంతా నీవల్లే జరిగినట్లు రుజువయిపోతుంది.

ఫు : మరి ఏటి సెయ్యాలయ్యా?

నర : పోలీసోళ్ళకి మేత పెట్టాలి.

ఫు : ఆళ్ళకి మేతపెట్టేంతటోణ్ణా బాబయ్యా.

నర : నువ్వు పెట్టగలిగేది లేంది వాళ్ళకెందుకు? వాళ్ళకి కావల్సింది లంచం.

ఫు : నాకాడ నాలుగొందల రూపాయలు ఉండాయి బాబయ్యా.

నర : నీకాడ బంగారముండాలి కదా?

వు : అది బాయిలో ఉంది బాబయ్యా!

కర : బాయిలో బంగారముండేదేందిరా!

వు : అవును బాబయ్యా. సుశీల చెవులకి దుద్దులు వేయించు కుంది. అవి దాని చెవులకే ఉండాయి.

కర : ఆ పోలీసోళ్ళు మహా పెడర్థపువాళ్ళు (ఆలోచించి) వరే నీ దగ్గరవున్న నాలుగొందలూ, ఆ అమ్మాయి చెవులకమ్మలు నాకివ్వు. నీకు యెలాంటి అపాయం లేకుండా జైలుకి పోకుండా నేను చూస్తా.

వు : నా కూతురు పోయింతరవాత నేను జైలుకి పోతే మాత్రమేం బాబయ్యా!

కర : ఓరి అదేనటరా నీకు తెలిసింది. చంపితే ఒక్కసారి చావచ్చు. కానీ ఈ పోలీసులు నిన్ను రోజూ జైల్లో పెట్టి బాధలతో ఎముకలు సున్నం చేస్తారు. చిత్రవధ చేస్తారు.

వు : మరేం చెయ్యమంటారు?

కరసి: నువ్వు వెంటనే అమ్మాయి శవాన్ని బాయిలో నుంచి బయటికి తీసి తగుల బెట్టండి! పూడ్చి వేయకండి! తర్వాత ఆ వచ్చిన పోలీసులకి నీవు యిచ్చే నాలుగొం దలు ఇచ్చి సరిచేస్తా. ఇప్పుడు ఉన్నాయా డబ్బులు.

వు : (పంచ కొంగులో నుంచి డబ్బు తీస్తూ) ఉన్న పైసా అరపైసా మా దగ్గరే ఉంటాయి గానీ ఆ బతుకుల కొంకలో ఎట్టా ఉంచుతాం బాబయ్యా! ఇదిగో నాలుగొందలు.

నరసి: (తీసుకొని) వెళ్ళు. త్వరగా ఆతని పూర్తిచేసి ఎవ్వ
కనిపించకుండా వెళ్ళిపో.

పు : అట్లాగే బాబయ్యా. (గబగబా బయటికెళ్ళాడు)
[నరసింహం డబ్బులు తీసుకొని లోనికెళ్ళాడు. బయట
నుంచి కొండయ్య పాటపాడుతున్నట్లుగా సారా
తాగినోడు నరగలోకం బోతాడు కల్లుతాగినవాడు
కైలాసం పోతాడు]
[నరసింహం వచ్చి] ఒరే కొండయ్యా కొండయ్యా

కొం : (తూలుతూ ప్రవేశం) ఏంటి పెద్దయ్యగోరు.

నరసి: నీతో ఒక చిన్న పనిపడిందిరా!

కొం : నాతో పనిలేని నాకొడుకెవడు లేండి బాబూ!

నరసి: ఓరి పిడుగా! (మాట చెవులో ఏదో చెప్పాడు)

కొం : అట్టాగే దొరా! అయితే పైసలు...?

నరసి: ఇదిగో తగలడు ఆ చోటుకి

కొం : అట్లాగే బాబు. (బయటకెళ్ళాడు, బయటినుంచి గబ
గబా కాంతయ్య ప్రవేశం)

కాంత: ఆరే, నరసింహా!

నరసి: ఎంటిరా అలా బెదిరిపోతున్నావు!

కాంత: నీవు చెప్పినట్లే ఆ అమ్మాయి సుశీలను చం
బాయిలో పడవేశాను.

నరసి: సరే ఈ వుత్తరం ఎలా తయారు చేయించావు?

కాంత: బాగా నడిరేత్రి సమయంలో నేను పల్లెలో ప్రవేశించి
పుల్లిగాడి ఇంటికెళ్ళి గొంతుమార్చి పిలిచాను. సుశీ
పిన్నా తన తండ్రిగా భావించి తలుపు తెరిచింది

వెంటనే కత్తి చూపి భయపెడుతూ ఆ అమ్మాయి నోరు మూశాను. ఉత్తరం వ్రాయమని బెదిరించి వ్రాయించాను.
ఆ తర్వాత ఒకే ఒక్క పోటుతో ఈ లోకం నుంచి సుశీలను సాగనంపాను. ఆ శవాన్ని భుజాన వేసుకొని ఎవరికంటా బడకుండా బావిలో పడవేశాను. చిన్నగా ఇల్లు చేరుకొని నిద్రపోదామని ప్రయత్నిస్తే నిదపట్టి చస్తేగా!

భరని: మీ కొడుకు క్రాంతికుమార్ ని ఏం చేశావు?

కాంత: అదా, అదృష్టమనేది కలిసివస్తే అదెంతపని? మొన్న నేను పట్నమెళ్ళినప్పుడు మావాడి స్నేహితుడు ఒకడు బాగాలేక హాస్పటల్ లో చేరాడు. నిన్న నాకు అది గుర్తుకు వచ్చి, వాడితో చెప్పి చూచి రమ్మని చెప్పాను. వెంటనే బయలుదేరి పట్నం వెళ్ళాడు. రాత్రికి రాత్రి నేను ఆ అమ్మాయి...

[కొండడు ప్రవేశం]

కొండ: సఫాచేశావు. అంతేగా!

కాంత: ఆఁ! కొండడూ!

కొండ: నేనే! భయంగా ఉంది కదూ!

కాంత: నీకెలా తెల్సు ఈ విషయం?

కొండ: పిల్లి పాలుతాగుతూ తననెవరూ చూడటంలేదను కుంటుందట, అలాంటి వాడివి కాంతయ్యా నువ్వు.

కాంత: నువ్వు చూశావా!

కొండ: ఈ రెండు కళ్ళతోటి చూశాను.

కాంత: ఆఁ!

కొండ: ఆఁ! అది అలా గుడ్లు తేలేస్తే లాభం లేదు. అవతల పోలీసులు వచ్చేస్తున్నారు.

కాంత: పోలీసులా!

కొండ: పోలీసులంటే తెలియదా! పట్నంనుంచే వస్తున్నారు.

కాంత: ఎలా చెయ్యాలి నరసింహాం?

నరసి: నేనేం చెప్పేది?

కొండ: ఒక నిండు ప్రాణాన్ని తీసిన కసాయివాడివి, పోలీసులు రాగానే వాళ్ళకు ఈ విషయం చెప్పి నీకు బేడీలు వేయిస్తా!

కాంత: ఒరే కొండయ్యా! నీ కాళ్ళకి దండం పెడతా చెప్పకురా!

కొండ: అయితే కొంత ఖర్చు అవుద్ది!

కాంత: ఎంత?

కొండ: మీరు చెప్పండి. అది మర్డర్ కేసు. దాదాపు .0 వేలకి పైన ఉండాలి.

కాంత: అమ్మో అంతా!

కొండ: పాపం వయసులో ఉన్న పిల్లని చంపితే మరి ఎంతనుకున్నావ్.

నరసి: ఒరేయ్ కొండయ్యా! నువ్వు కొద్దిసేపు బయటుండు నేను మాట్లాడిపిలుస్తాను. (కొండయ్య బైటికిపోవును) కాంతయ్యా! ఇక లాభంలేదు పరిస్థితి అడ్డం తిరిగింది.

కాంత: 10 వేలు నా దగ్గర లేవు!

నరసి: ఎంత ఉన్నాయి?

కాంత: నాలుగువేలు ఉన్నాయి?

నరసి: అయితే ఇలా ఇవ్వు! ఆ కొండడికి నేను ఎలాగో నచ్చచెప్పి పంపుతాను.

కాంత: ఇదిగో! (జేబులోంచి డబ్బు ఇచ్చును)

నరసి: (తీసుకొని) ఇక నువ్వు వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపో! (కాంతయ్య వెళ్ళును; 3 వేలు జేబులో దాచి ఒక వెయ్యి చేతిలో ఉంచుకొని) ఒరేయ్ కొండా! కొండా!

కొండ: ఏటి బాబూ!

నరసి: ఆడివగ్గ రేముందిరా! అంతా అయిపోయింది. ఒక వెయ్యి రూపాయలు ఇచ్చాడు! ఇదిగో తీసుకో!

కొండ: (తీసుకొని) భలేవారు బాబయ్యా మీరు. దారిన పొయ్యే నన్ను పిలచి వెయ్యి రూపాయలు యిప్పించారు. మీ జేబులో మూడువేలు ఎవరకండి?

నరసి: ఆఁ!

కొండ: నాకంతా తెలుసండి! 4 వేలు కాంతయ్య ఇచ్చాడు, మీరు మూడువేలు దాచిపెట్టుకొని ఒక వెయ్యి నాకిచ్చారు. ఆ మూడూ ఇటివ్వండి సరిపోద్ది!

నర: నాకూ?

కొండ: ఇవ్వు చెబుతాను [యిచ్చాడు. కొండయ్య తీసుకున్నాడు]

కర : చెప్పరా?

కొండ : హరికథ తర్వాత, ముందు వీరు యివ్వవలసి

ఇవ్వండి.

మర్డర్ చేసినోడు నాలుగువేలు ఇచ్చాడు. మర్డ
చేసినోడికంటే చేయించినోడికి శిక్ష ఎక్కువ అను
గించాలి. అందుకే నువ్వెంత ఇచ్చుకుంటావో చెప్ప

కర: నేనెందుకు?

కొండ: హరికథ మళ్ళీ చెప్పాలా! మర్డర్ చేయించినందుకు

కర : ఆ!

కొండ: ఆ లేదు, ఊ లేదు. త్వరగా 6 వేలు ఇచ్చుకో. లేకుంటే
పోలీసులు, పిస్తోళ్ళు, సంకెళ్ళు జైలుశిక్ష.

కర: తగ్గించరా!

కొండ: దొంగతనం చేసినా చట్ట ప్రకారం చేయాలి. మర్డర్
చేసినోడు 4 వేలయితే చేయించినోడు 6 వేలు ఇవ్వటం
చట్టం, న్యాయం, ధర్మం!

కర: దొంగలకు కూడా చట్టం తెలుసా?

కొండ: చట్టాన్ని నిలబెడుతుంది కూడా దొంగలని మరచి
పోకండి. తొందరగా ఇవ్వండి డబ్బు. అవతల పోలీ
సులు.

నర: (డ్రాయర్ సొరుగునుంచి డబ్బు తీసిఇచ్చి) ఇదిగో!

గొంది: మళ్ళొస్తా బాబయ్యా! (డబ్బు తీసుకొని పోతూ)

నర: మళ్ళీ ఎందుకు మా ప్రాణాలు తియ్యటానికా?

గొంది: నికార్సయిన నాటుసారామీద ఒట్టుపెట్టుకొని చెవి స్తున్నా తథాస్తూ! (వెళ్ళాడు)

నర: అరెరె! పీడితోటి వ్యవహారమంతా దారిపోయేవాడ్ని పిలిచి తన్నిచ్చుకున్నట్లుగా వుందే. అరనిముషంలో ఆరువేలు వసూలు చేసుకొని పోయాడు. ఏదో ఒక రోజు ఈ త్రాగుబోతు దగ్గరనుంచి ఆరుకిఆరువసూలు చెయ్యాలి. ఏదో ఒక కేసు ఈ యెదవపై మోపి జైలుకి పంపాలి.

[బయటనుంచి క్రాంతికుమార్ సుడిగాలిలా ప్రవేశం]

క్రాం: రేయ్, నరసింహం! (కోపంతో పెద్దగా)

నర: క్రాంతికుమార్!

క్రాం: అవును క్రాంతి! అంటే విప్లవం! మీలాంటి సంఘ ద్రోహాలకు విప్లవమంటే భయం, గుండెలు పగిలే భయం!

నర: నువ్వు...నువ్వెందుకొచ్చావు?

క్రాం: కడుపుమండిన పేదప్రజలు ఏంచేస్తారు? ఆకలిమంటలతో అవురావురు మంటున్న పెద్దపులి ఏంచేస్తుంది?

నర: అంటే నువ్వు!

ప్రకాం: ప్రతీకార జ్వాలలతో మండిపోతూ పగ సాధింపు కోసం పంజా విప్పిన పెద్దపులిని.

శర: ఎవరిమీద పగ సాధిస్తావు?

ప్రకాం: నీమీద.

శర: నాపైనా?

ప్రకాం: ఔను.

శర: ఎందుకు?

ప్రకాం: అర్థంపర్థం తెలియని కన్నపిల్లని కాటికిపంపినందుకు డబ్బుకోసం అడ్డమైన గడ్డితిని అమాయకుల ప్రాణాలతో ఆడుకున్నందుకు-సుశీల ఎవరు నా ప్రేయసి. మీకు కావలసింది కులం, మాకు కావలసింది మనస్సు. కులమత భేదాలు సృష్టించి ఈ సంఘాన్ని కలుషితం చేసి ప్రజల జీవితాలలో ప్రళయం సృష్టించే మీలాంటి సంఘద్రోహులకు స్థానం లేదు. నీ లాంటి అవినీతిపరులకు స్థానం లేదు. ఈ సంఘంలో నీలాంటి దుర్మార్గులు వున్నంతవరకు ఏ వ్యక్తి సుఖశాంతులతో బ్రతకలేడు అందుకే నిన్ను చంపుతాను. అవినీతి నిన్ను చంపుతాను.

నర: కుమార్!

క్రాం: (నవ్వి-కత్తితీసి) అవినీతి నీ ఆయువు తీరింది...(పొడి
చాడు-నవ్వుతూ) అవినీతి నీకు దిక్కెవరు?

నర: [పడిపోయాడు క్రింద] అబ్బ!

క్రాం: [నరసింహంపై కాలుపెట్టి] అవినీతి నీకు దిక్కెవరు?
[నవ్వి] అవినీతి నీకు దిక్కెవరు?
[బయటనుంచి కాంతయ్య ప్రవేశం]

కాంత: ఆ! ఏమిటి?

క్రాం: నీతికీ అవినీతికీ జరిగిన పోరాటం, భీషణ సంగ్రామం
[నవ్వి] నాన్నా! ఈ భీకర పోరాటంలో ఎవరు గెలి
చారో తెలుసా! [పిచ్చిగా] హాహాహ నీతి...నీతి...
నీతి గెలిచింది...హాహాహ...అవినీతి అంతమయింది.
[కత్తితో కాంతయ్యను పొడిచాడు. కాంతయ్య
బాధపడుతూ క్రిందపడి]

కాం: ఒరేయ్ బాబూ! ఎంతపని చేశావురా! కన్నతండ్రిని
చంపేశావురా! కన్నతండ్రినే చంపేశావు.

క్రాం: [నవ్వి] అన్యాయం, అక్రమం అధర్మం అవినీతి ఎక్కడ
ఉంటాయో అక్కడే ఈ క్రాంతి ఉంటుంది. అంతిమ

విజయం పొందేదాకా క్రాంతి పోరాడుతుంది. కన్న తండ్రి కావచ్చు కన్న తల్లే కావచ్చు. అవినీతిని ఆదరించేవారికి ఈ క్రాంతి గుండెలో గాలం. ప్రక్కలో బల్లెం. ఈ నాటితో ఈ గ్రామం పీడ విరగడయిపోయింది. ధనమద దురహంకార శక్తియే ఓడిపోయాయి.

[బయటనుండి ఇన్‌స్పెక్టర్ ప్రవేశం]

(క్రాంతి నవ్వుతూ ఉంటాడు)

(ఎస్. ఐ క్రాంతికుమార్‌కు సంకెళ్ళు వేయించాడు)